శ్రీ

శ్రీసద్గురుసమాధిక్యవరబ్రహ్మణేనమః

భక్తులకత్యంతోపయుక్తమగునటుల

ఆర్యజనవిధేయుండగు

శ్రీమత్తగరంపూడి అప్పసామిచే రచియింపఁబడిన

# సత్యజ్ఞానానందాటవెలదులు




మొదటి కూర్పు 1000

రాయవరము

శ్రీ మేరీ ముద్రాక్షరశాలయందు

మల్లిడి సత్తిరెడ్డిగారిచే ముద్రింపఁబడి

గొల్లలమామిడాడ నివాసులగు మహారాజశ్రీ ద్వారంపూడి

సూరారెడ్డిగారిచే ప్రకటింపఁబడెను

1919

కాపీరైట్ రిజిష్టరు

వెల 0—3—0

శుభమస్తు

శ్రీసద్గురుమాణిక్యపరబ్రహ్మణేనమః

# సత్యజ్ఞానానందాటవెలదులు



ఆ. వె. శ్రీగురుపదపూజ • చిత్తాబ్జములజేసి
భళిశభాసటంచు • భక్తులనగ
చెప్పెదనొకచిన్న • సిసలైనపాత్రంబు
సురజనాళిగిడ్డి • సూరరెడ్డి

౨ గురునిచరణమహిమ • గుర్తెఱింగిసశిష్యు
డరయగాశిస్నాన • మరుగబోడు
ఫలరసంబుగోరిలు • చిలుకకుమ్మెరలేల
సురజనాళిగిడ్డి • సూరరెడ్డి

ముడ్డిజూచిపీట • మోముగాంచియుమాట
పలుకుచుందురిసరులు • పాపమనక
అట్టివారినెల్ల • ముట్టబోవుటవప్పు
సురజనాళిగిడ్డి • సూరరెడ్డి

౪ సజ్జనుని నడతలు ♦ సత్పురుషుసంగు
దుర్జనుం జెనగుట ♦ దుర్లభంబు
బిడ్డసార మెట్లు ♦ గొడ్డుకో తెలుసురా
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౫ ఆత్మరిపులనెల్ల ♦ నణచవేరనివాడు
పరమునెట్లొసగును ♦ భ్రాంతిగాక
యిల్లు గెలవనోడు ♦ నిల రచ్చగెల్చునా సు॥

౬ బుద్ధిశాలికీర్ష్య ♦ పుట్టనేబుట్టదు
పుట్టెన యదినిల్వ ♦ కట్టుబోదు
అద్ధిపొంగనేని ♦ సంతలోతు గ్రుంగునా సు॥

౭ తెలివిలోనగలడు ♦ తేజైన దేవుండు
మరుపులోనగలడు ♦ మాయకాడు
తెలివి మరుపునెఱుగ ♦ తేజమైయుండదా
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౮ చర్మగేహమహిమ ♦ జెప్పనేరనివాని
వెంట నంటిదిరుగ ♦ వెఱ్ఱితనము
గొడ్డుగేదిపాల కొఱకు ♦ బూచెపు కితి సు॥
శీర్షమూత్రి వసెగ ♦ తిన్న దరుగికగాని

౧౫ తత్వ మశ్వయంబు ♦ తరచి యానందించు
యుత్తమపురుషుండు ♦ యుర్విలోన
విత్తమెల్ల గూర్చి ♦ విఱ్ఱవీగును పాపి
సురజనాళికిష్టి ♦ సూగరిష్టి

౧౬ నీవు మిరపకాయ ♦ చెప్ప నెంతకలదు
గూబ తాళ మంటి ♦ గుంజివేయు
పథ్య మెంతయైన ♦ పస యుంటె చాలదా

౧౭ యోగ మందు లేదు ♦ త్యాగ మందును లేదు
దాన మందు లేదు ♦ తగు ఫలంబు
యోనియందు లేదు ♦ యొట్టొట్టి దీర్ఘము

౧౮ చూపుగోరు కళ్లు ♦ సుఖముగోరునొడలు
చవులుగోరు జిహ్వ ♦ చక్కగాను
చూపుచూపులందు ♦ సుఖమదేముందురా

౧౯ మూటిమూటిలోన ♦ నూటిని గనుగొన్న
ఆటలెల్ల పట్టి ♦ బూటకములు
నూటిగన్నవాడె ♦ శుద్ధతత్వజ్ఞాని

౨౦ సతులు లేనివాళ్లు ♦ సంతలో చావళ్లు
పూజలేనిగుళ్లు ♦ బొమ్మకళ్లు

వారిశరేని వేళ్ళు ♦ యీతమంచెలమళ్ళు
సుకజనాళికెడ్డి ♦ సూరకెడ్డి

౨౧ శ్రుతిసారమెల్ల ♦ పరమయోగులెగాని
మూర్ఖుడేమెరుగును ♦ మూలమహిమ
నాగసరముపాట ♦ నత్తకాయెరుగునా

౨౨ బాసలాడువాడు ♦ కాసుచేయగలేడు
కేలిగొట్టువాడు ♦ గెలువలేడు
కల్లలాడువాడు ♦ కాంతకిష్టునురా

౨౩ ఆశ లుడిగనేని ♦ యందమడుగనేల
పుణ్యమెరుగకున్న ♦ పూజలేల
ఆకలెరుగకున్న ♦ పాకశాకములేల

౨౪ విద్యనేర్చితిమని ♦ విఱ్ఱవీగగరాదు
ధనముగూర్చితిమని ♦ తక్కరాదు
విద్యధనములెల్ల ♦ వెంటరాబోవునా

౨౫ పొట్టివానికేల ♦ పొడిగంటి పెండ్లాము
కూనివానికేల ♦ గుడ్డగొడుగు
గుణవిహీనునికేల ♦ గుర్వుపదేశంబు

౨౬ కొద్దివానినమ్మి ♦ గొప్పకార్యము చేయ

తుదకునెగ్గబోదు ♦ విధిగనమ్ము
కుక్కతోకబట్టి ♦ గోదావ రీదుట
సురజనాళిగిడ్డి ♦ నూరరెడ్డి

౨౭ ఊరుపేరులేదు ♦ యుత్తరన్నుగాదు
అంతనిండియున్న ♦ దంతులేక
ముట్టుకొన్నవాని ♦ పట్టుకవీడునా

౨౮ బొత్తులేనిబిడ్డ ♦ బారెడు పొడుగుండు
పెరుగకున్న పైరు ♦ కెరపుమొండు
అల్పబుద్ధివానికి ♦ యతిశయము మెచ్చుటు

౨౯ పాలు పెరుగుతోను ♦ పంచదారలతోను
పాయసంబుతోను ♦ పప్పుతోను
కాయమొంతబెంచ ♦ కట్టెకేగదా

౩౦ ఉల్లిపువ్వనన్న ♦ మల్లిపూవునుగాదు
మాయతల్లిమెప్పు ♦ మాతగాదు
గుడిసెలంజయాల్లె ♦ గుణవంతురాలౌన

౩౧ అద్ద కాళ్లకెందు ♦ కందెలు బేడీలు
యూచవేళ్లకెంపు ♦ కుంగరాలు
బట్టతల కదేల ♦ బంగారు రాగిడి

3౨ దొంగవాని చూపు ♦ దొడ్డి గుమ్మములందు
వేశ్యకాంత చూపు ♦ విటులయందు
గుంటివాని చూపు ♦ కూటి కుండందురా
సురజనాళిగిడ్డి ♦ నారరెడ్డి

33 అంబలయిన నేమి ♦ సంబలైనను నేమి
పొట్టనిండ కలిపి ♦ పోయుటకును
రాలగొట్ట పండ్లు ♦ రాయియేదయి తేమి

3౪ దోషిహాబుద్ధివాని ♦ దొడ్డగా మన్నింప
తిన్నయింటికెట్లు ♦ కన్నమొత్తుడు
తాకబోవ తేలు ♦ తోకతోగొట్టదా

3౫ మూకపూట్లుతిండి ♦ ముద్దుముద్దుగ పెట్టి
కడిగి పెంచుచున్న ♦ కడగుతనువు
కాటికరుగకుండ ♦ కనిపెట్టుకుందునా

3౬ కర్మతాళ్ల చేత ♦ కట్టువడియుండిన
పురుషుడెన్నడైన ♦ పూజ్యుడగున
మక్షికములుగాయ ♦ మధుకాట్లు లభియించు

3౭ అల్పజాతివాని ♦ కధికార మగునేని
విట్టివీగితిపగు ♦ పీఘులందు

పాతలంజకొరకు ♦ బలవంతుడున్నట్లు
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౩౮ ఇల్లుశుద్ధిలేని ♦ యిల్లాలెందుకు
తెడ్డుశుద్ధిలేని ♦ వడ్డనేల
హృదయశుద్ధిలేని ♦ యుపవాసమేలరా

౩౯ అట్టురొట్టెకుడుము ♦ లాసాదికిని బోవు
ఫలలమన్న మరుగు ♦ పంచములకు
పోగునూళ్లురొట్ట ♦ పోలేరుతల్లికి

౪౦ మానమొకటియుండు ♦ మదికోరికలు రెండు
గలిగియుండెనేని ♦ జ్ఞానమేది
మబ్బుగమ్మువేళ ♦ మార్తాండుడుండునా

౪౧ ఊహాపోహలెన్న ♦ యుపదేశ గురువులు
మాటలాడునదియు ♦ మంటిబొమ్మ
యిట్టిపనువుపైని ♦ యింతప్రేమదియేల

౪౨ ద్రవ్యముడిగెనేని ♦ ధర్మమంతయునుడుగు
ధర్మముడిగెనేని ♦ దయలునుడుగు
దయలునుడిగెనేని ♦ దాయాదులికయుడుగు

౪౩ గుడ్డికన్నుకెట్ట ♦ కుంచెడు కాటుక

తిన్నబదున నదియు ♦ మున్ను ఫలెను
మడ్డివానికంతె ♦ మన మెంత జెప్పినా
సురజవాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౪౪ నడకలేనికాళ్లు ♦ నల్లని రోకళ్లు
చవిదెలియనిజిహ్వ ♦ సన్నికల్లు
చదువులేనిమొద్దు ♦ కదలలే నెద్దయా

౪౫ పడతిటోడబోరి ♦ కుడువక చనినేని
యున్నదంత మెక్కి ♦ యూరకుండు
పొట్టనిండగొట్టి ♦ బోరాడవలెనయ్య

౪౬ పంజరమ్ములోని ♦ పక్షిరీతిగనుండు
ఆత్మయందు జ్ఞాన ♦ మమలముగను
దిట్టదనముచేత ♦ బట్టుకోవలె సుమా

౪౭ కుతుకలోనిప్రాణి ♦ గోలుపోకను ముందె
తత్వమెఱిగనేని ♦ ధన్యుడవును
దీపముండగాన ♦ తెల్విదెచ్చుకో వేగ

౪౮ కాకి కోకిలకును ♦ యాకారమొక్కటే
చూడజూడ కూత ♦ బాసవేరు
మనుజ కోటిలోన ♦ మంచివారట్లనే

౪౯ మెరుక మఱుపు లేక ♦ నెచ్చోట యచలమై
శుద్ధతత్వమనెడి ♦ బుద్ధిగలుగు
అదిగదా సుముక్తి ♦ యయినవారలకెల
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౫౦ అగ్గురకును జిక్కి ♦ యాయాసపడనేల
మగ్గురకును జిక్కి ♦ మూల్గనేల
యొక్కనికిని జిక్కి ♦ యొప్పకో దీపది

౫౧ మాయ నెఱిగనేని ♦ మర్మమెరుగవచ్చు
మర్మమెరిగనేని ♦ మాయజచ్చు
మాయజచ్చెనేని ♦ మఱియేమిలేదురా

౫౨ తనకు తగనిబాండ ♦ తగిలించుకొనియుండ
మరల నేగుచుండు ♦ మాయముండ
ముందుదెచ్చు ముప్పు ♦ మూలబడియుండగా

౫౩ చెప్పగాను రాక ♦ శక్తి శూన్యంబయిన
విన నదెట్లుబట్టు ♦ మనసునందు
మేఘమింత లేక ♦ మెఱుపుగల్గుట సున్న

౫౪ కొండనూడువాని ♦ కొంపగాల్చినవాని
లంచమట్టువాని ♦ లంచకాని

పాత రేస్తి లేదు ♦ పాపమించుకయైన
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి
౫౫ చెప్పబడెడుమాట ♦ చెప్పినే బోధ్యస్తి
చేయబడ్డ పనులు ♦ జేసిపెడితి
చెప్పుచున్న వినదు ♦ త్రిప్పుకొంచీముండ
౫౬ తల్లిదండ్రులెవరు ♦ తనయులాప్తు లెవరు
భాతృమిత్రులెవరు ♦ భార్యయెవతె
యెవరికెవరు లేరు ♦ యేలకో యీభ్రాంతి
౫౭ అంటుముట్టు లేని ♦ యతివకూటముకన్న
శునకకూటమిలను ♦ సొంపుగుండు
మందచిప్పకన్న ♦ మరాత్రికు మేలుగా
౫౮ అనుభవంబు లేని ♦ యయ్యవారినిబట్టి
యున్న మానసుపోయి ♦ మన్ను గలసు
పాదరసముదాక ♦ బంగారు కగ్గదా
౫౯ కొడుకుబిడ్డకన్న ♦ కూతుబిడ్డయుముద్దు
అసలుకన్నవడ్డి ♦ సరయ ముద్దు
భార్యకన్నలంజ ♦ బహుబాగ ముద్దురా
౬౦ పైని నీళ్లుపోసి ♦ బాగుగా గడిగిన

లోని కల్మషంబు ◆ లొంగబోదు
ఆత్మగడుగనట్టి ◆ యాచారమేలరా
సురజనాళిగిడ్డి ◆ సూరరెడ్డి

౬౧ లక్క మేడలోన ◆ చక్కని చుక్కండె
ముక్కునున్నగాలి ◆ మూటకట్టి
ప్రక్కజేర్చుకొమ్ము ◆ పదిలంబుగా దాని

౬౨ నిగురు గప్పియున్న ◆ నిప్పుచందమునుండు
ప్రాలుపూలినట్లు ◆ ప్రాజ్ఞులిలను
మనుజనరసిగాదు ◆ మనసుయరసిజూడు

౬౩ చక్కనైనకాంత ◆ సంసారమునకు చేటు
గొంతులేని కడవ ◆ దొంతిచేటు
పనికిరానిమందు ◆ పథ్యంబు చేటయా

౬౪ జ్ఞానిననుచు జెప్ప ◆ మానమింతయులేదు
మానముండెనేని ◆ జ్ఞానమేది
కీలు దెలిసెనేని ◆ కాలుదువ్వన ముందు

౬౫ పెద్దగుంటనీళ్లు ◆ పెక్కుముద్దుగడుగ
లెక్కజేయరెవరు ◆ నిక్కమిలను
భాగ్యమున్నయట్లె ◆ బాయకంపున రంపు

౬౬ తనువసత్యమనుచు ♦ దలచనేరనివాడు
పుట్టిగిట్టుచుండు ♦ పుడమియందు
తత్వమెరిగెనేని ♦ తనువు గారముగాదు
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౬౭ జన్మతోడకర్మ ♦ జంట బాయకనుండు
కర్మతోడ జన్మ ♦ గల్గుచుండు
తాడుతోను చేత ♦ తగిలివచ్చినయట్లు

౬౮ బుద్ధి భూమిలేల ♦ నుద్దేశపడుచుంటె
వాతచరకజోలి ♦ వెతుకుచుండు
పుట్టుసారమంటె ♦ పెట్టుసారముగల్గు

౬౯ కలిమిగల్గువేళ ♦ కాపురంబులుజేసి
లేములొచ్చువేళ ♦ లేచిపోవ
చిత్తినీకెగాని ♦ చెల్లునా పద్మశ్రీ

౭౦ తనమ యూరివైద్య ♦ మరయ తనకునంత
లాభకారిగాదు ♦ లోభకారి
పన్నుయిచ్చి మూపు ♦ తన్నించుకొన్నట్లు

౭౧ రొచ్చులోనబుట్టి ♦ రొచ్చులోనబెరిగి
రొచ్చుగుటపురు ♦ యిచ్చగల్గి

తుచ్ఛ సౌఖ్యమిదియు ♦ తుదముట్ట లేదురా
సుజనాళికెడ్డి ♦ సూరరెడ్డి

౭౨ దాసు తపసియైన ♦ తానెంతవాడైన
ఘటముకున్నపాట్లు ♦ గాకపోవు
ముందమోసియున్న ♦ ముట్లు మానవుగదా

౭౩ నీకుమేతమెపుడు ♦ నియ్యకున్నట్టుమున
గిట్టగరచి పండ్లు ♦ కొట్టుకుండు
పట్టితనువుకింత ♦ పయ్యారమేలకో

౭౪ ఎట్టివానికైన ♦ పుట్టి గిట్టుటయుండు
అదియుగాంచినట్టి ♦ యతనికెపుడు
పుట్టిగిట్టిరెండు ♦ పుడమిలో లేదురా

౭౫ ఇనుముచేత నినుము ♦ నింపుగా తెగుచుండు
వజ్రమొజ్రమట్టి ♦ వసరగోయు
యోగియోగిచేత ♦ యొప్పింపబడునట్లు

౭౬ అడిగితెమ్మన్కొన్న ♦ యడనీచమునిమించి
నిందజేయుటొక్క ♦ నీతిగాదు
అమ్మ నడుగకున్న ♦ యన్నంబు పెట్టునా

౭౭ అగ్గినొనినకాలు ♦ భగ్గుభగ్గునమండు

పులుపుగన్న పండ్లు ♦ పులియుచుండు
బత్తిగొనిన వనము ♦ బబ్బిగొని యుండట్లు
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౨౮ దూషకైనగాని ♦ భూషకైననుగాని
బూతులైనకాని ♦ నీతులైన
ఆత్మకంట నెప్పుడు ♦ నవియన్ని మేనికే

౨౯ బెల్లమున్నచోట ♦ పెక్కగా చీమలు
బార్లుబార్లుగట్టి ♦ పాకుచుండు
కలిమియున్నవేళ ♦ గలరట్లు జట్టాలు

౩౦ ఆకలెరుగబోదు ♦ పాకంబులోరుచి
నిద్దురెరుగబోదు ♦ నింతసుఖము
డెందమెరుగదట్లు ♦ ముందువచ్చెడి ముప్పు

౩౧ నీతికేగబోదు ♦ నిందకేగినయట్లు
చెడ్డకేగుచుండు ♦ చెనటి బుద్ధి
బురదకేగు పంది ♦ పూవాన్పుకేగునా

౩౨ కుంటివైనగాని ♦ గూనివైననుగాని
అంధుడయినగాని ♦ ననుదినంబు
పతియె దైవమనుచు ♦ భావించునది కాంత

౮౩ సంగమిషనికాంత ♦ పందెదుండగనేమి
పెట్టలేని సుతులు ♦ పెక్కురేమి
నీమమింత లేని ♦ నాకుమొత్తైతేమి
సురజనాళిగిడ్డి ♦ సూగరెడ్డి

౮౪ గాడిదరుగబోదు ♦ గంధపువాసన
కోతి యెరుగబోదు ♦ నీతి భువిని
మూర్ఖుడెరుగబోదు ♦ ముక్తిమార్గంబట్లు

౮౫ ఉన్నదొక్కచోట ♦ యున్నతమై తాను
లేదు తెలిసికొన్న ♦ లేశమైన
యుండి లేనటంచు ♦ యున్నదంతయునిండి

౮౬ కాకి కేకితోను ♦ కలసి స్నేహముజేయ
కేకినెమలు గాకి ♦ కెట్లువచ్చు
సుగుణు నంటియున్న ♦ సుజ్ఞాని పాపాన

౮౭ సుగుణమైనవాని ♦ జూచి నేస్తముజేయ
మంచిగుణములకడు ♦ మప్పజూచు
బాలికలకు తల్లి ♦ పనులు నేర్పెడిరీతి

౮౮ చేయికాలుగాని ♦ చెలగి జారిన తిరిగి
దీసికొనగవచ్చు ♦ తెలివిచేత

నోరు జారెనేని ♦ చేరదీయగలేము
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౮౯ నరము లర్వదారు ♦ నాళ్లు డెబ్బది రెండు
తొర్రలరసి జూడ తొమ్మిదుండు
నక్కకైన నిదియు ♦ చొక్కదు చెల్లితే

౯౦ మూషికములు జేరి ♦ మూటబట్టలుగొట్టు
చీడపుర్వు జేరి ♦ చెట్లు జెరచు
కుత్సితు లటుజేరి ♦ గుణవంతులనుమాపు

౯౧ ఉసిరికాయ శేత ♦ నుంచినట్టుగయుండె
పరమపదము యంత ♦ బ్రాకిప్రాకి
యిట్టికనుల కదియు ♦ పట్టుపడగబోదు

౯౨ కసవుసారమెల్ల ♦ బసువులెరుగు లెస్స
పనససారమెరుగు ♦ ఘనులు లెస్స
భక్తులెరుగు యట్లు ♦ ముక్తిసారము లెస్స

౯౩ నిజము దేవుడెఱుగు ♦ నీరుపల్లమెరుగు
పందుడై నవాని ♦ సతియెరుంగు
ధీరవట్యు నట్లు ♦ దేశికు డెరుగురా

౯౪ తాడి క్రిందనుండి ♦ ద్రాగుచుండిన పాలు

మద్యమానుమయందుఁ • వరాయజనులు
తల్లిపిల్లకల్లె • తగరంతు లిడుదురు
సురజనాళిగిడ్డి • సూరరెడ్డి

౯౫ తప్పుఁ వెదికెవారు • తమతప్పుగానక
యితరదప్పులెన్న • నేగుచుంద్రు
గుడ్డక్రిందనలుఁపు గురువింద గసనట్టు

౯౬ పంచముల కలుమలు • నెంచమద్యముపాలు
ధర్మమిడనిసొమ్ము • ఖర్మపాలు
లంచధనము పెక్కు • లంచాలపాలురా

౯౭ ఇంటిస్త్రీనిబాసి • నిలజారకాంతల
రతులకేగువాడు • రంకుకొడుకు
పెరుగు బువ్వమాని • పేడదిన్నట్టుగా

౯౮ ఐదుమైమదాటి • యవ్వలున్నట్టువంటి
పనుగెక్కువాడు • యతివరుండు
ముండిమాట్లకల్ల • మోతుమొల్లబ్బురా

౯౯ ఓలితక్కువంచు • నిలగుడ్డికాంతను
పెండ్లిజేసికొన్న • పెక్కుచిక్కు
బొమికగొట్టునెఱుకు • బెలగనిగ్రద్దవనుఁల్

౧౦౦ చెప్పినట్లువినుము ♦ చెల్లినట్లమనుము
గొట్టినట్లుబడుము ♦ కోపపడక
కొట్టినట్లుదినుము ♦ పెంకితేపముమాని
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౧౦౧ భూమిలేనిచోట ♦ పుట్టె నొక్కటి చెట్టు
చెట్టు కొమ్మ నైదు ♦ పిట్టలుండె
పిట్ట లట్టువాడె ♦ పట్టాభిరాముండు

౧౦౨ నిష్కళంకమైన ♦ నీ స్వరూపమునందు
సగుణరూపమైన ♦ జగము పుట్టె
సమసిపోవుతుదకు ♦ సర్వమంతయు నీలో

౧౦౩ ద్వంద మెపుడు కావు ♦ ద్వాదశార్థుడవీవు
నిన్ను నీవుజూచి ♦ నిలిచియుండు
నీవె నీవుగాక ♦ నీకేది మాయరా

౧౦౪ భాస్కరోదయంబు ♦ బయలు వెలుగాని
గొప్పదైన చీక ♦ టప్పుడేది
ఆత్మదీపవెలుగ ♦ యజ్ఞానమటుపోవు

౧౦౫ షట్కోణములోన. ♦ పాటింప కెంజాయ
యుంటియుండు పిల్ల ♦ నడియు నిజమె

నిన్నుయంటిలేదు ♦ నీజగత్రయమట్లు
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి
౧౦౬ శూన్య రూపమైన ♦ శుద్ధ నిర్గుణబ్రహ్మ
మయుడవైన నీకు ♦ మాయ లేదు
నిశ్చలుండ వెపుడు ♦ నిజమిది నమ్మరా
౧౦౭ కదలుచుండువాడు ♦ కాదుకా డాత్ముండు
కదలకున్నవాడె ♦ గట్టిగతడు
కదలుచున్నదెల్ల ♦ కాలచక్రింబురా
౧౦౮ గాలినాశ్రయించి ♦ కదలుచున్నమనసు
గట్టిపట్టినట్టి ♦ ఘనుడెవండు
గుణుడు విశ్లెవచ్చి ♦ గుర్తెసంగకయున్న
౧౦౯ పరమ పదవియనగ ♦ పైనెక్కడో లేదు
నిండియున్నదంత ♦ నిశ్చయముగ
వ్యాప్తి యందుమనసు ♦ జ్ఞప్తిలేనట్టుగా
౧౧౦ ముందుపాదుకదిపి ♦ మూలికాంతముజూచి
పైకివేయువేగ ♦ పిరికిపడక
పుట్టనేరదెవుడు ♦ గట్టిగాభువిలోన
౧౧౧ కాలుజెసికొనియిచ్చి ♦ గాయపుంటిలో

నిపుడు చెప్పుకొన్న ♦ నేమి ఫలము
అయిన నట్టిపనికి ♦ యాలోచనేరా
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౧౧౨ రాపరాపబుట్టు ♦ నేపుమీరగయగ్ని
దారువందుచూడ ♦ తథ్యమట్లు
తరచతరచబుట్టు ♦ తనువుతత్వంబు

౧౧౩ చచ్చిపుట్ట రోజు ♦ సాహజమైయుండ
వేరెజచ్చుదానికి ♦ వెదకనేల
దీనిసంధి తెలియు ♦ దెలివి నీవై యుండు

౧౧౪ ముక్కునెక్కిగన్న ♦ చక్కనిదగు దివ్య
రూపమంత దెలియ ♦ రూఢిగాను
యిదియు కాను తనకు ♦ నిజమైనరూపంబు

౧౧౫ తెలికపిండి నూనె ♦ తెలియ నొక్కటైన
గాండ్లవాడెవేరు ♦ కనుగొనంగ
దేవజీవులొకటె ♦ దేహమే వేరురా

౧౧౬ లాందరు షుచిగన్న ♦ లాలితంబుగదివ్వ
కాంతి నద్దికలకు ♦ గల్గుముందు
మనసు ముదిగయన్న ♦ మూర్ఖమల్లిగపడు

౧౧౭ నిజముగడని నమ్మి • నీళ్లుకోడిపెసితే
చంక బెట్టుకొంది • సాగినట్లు
అనుగకుంపటౌదు • యవ్విధంబున తన్వ
సురజనాళిగిడ్డి • సూరరెడ్డి

౧౧౮ గుమ్మ యిచ్చినట్టి • గొడ్డలిచేబూని
చింతతోట నరుకు • సంతనమున
తోట నరకకున్న • తోవ గాంచుటనున్న

౧౧౯ కామరిపురిలో నిలచు • గోపాలరెడ్డిస్త్రీలు
గొప్పదనము మిగుల • జెప్పవచ్చు
ధరను బండువంటు • దానికే బోవురా

౧౨౦ కుక్క మొప్పుగాదు • గొప్పెనగుల్లాబు
యిత్త డెప్పుడు కాదు • పుత్తడిలను
రాతిబొమ్మయట్లు • రాఘవేంద్రుడుగాను

౧౨౧ దినెసివాన్కి లేక • ఏమలకును శ్రద్ధ
జెప్పవాన్కి నెల్లు • వెలుగుబుద్ధి
కత్తిపీటకేల • కందకూడని దుర్గ

౧౨౨ వెలగి మద్దినవును • సింహావలోకుని
పూజచేసి గన్న • పుత్రికుంట

అప్పసామియనుచు ♦ యవనిలోననుబిల్చు)
సురజనాళిగడ్డి ♦ సూరరెడ్డి

౧౨౩ అన్నరసముకన్న ♦ నాదరసము మేలు
ముచ్చిలిమటకన్న ♦ ముష్టి మేలు
పట్టిజపముకన్న ♦ వైరాగ్యమే మేలు

౧౨౪ గురుని కరుణగాంచి ♦ గూఢార్థ మెఱిగియు
పాటుబడ్డయపుడె ♦ ఫలము గల్గు
ఫలముగన్నవాడె ♦ ప్రభులకు ప్రభువురా

౧౨౫ అడుగబోవుమాట ♦ లావుకొనడ మేల
మడ్డివెనుక కేగి ♦ మూల్గనేల
చల్లకొచ్చిముంత ♦ చాటెట్టినట్టుగా

౧౨౬ ఎద్దుబండికలసి ♦ యొప్పుగానొకటైన
యెట్టిగట్టునైన ♦ నెక్కిపోవు
ఆలిమగడుగూడ ♦ యత్తేమిచేసురా

౧౨౭ చక్కెనెంతయున్న ♦ చెక్కలకేగాని
కోసితినగబోరు ♦ కొంచమైన
బుద్ధిచక్కనైతె ♦ పుట్టెడందముగల్గు

౧౨౮. కాకిబెంచబెరుకము ♦ కేకలొచ్చువెనుక

ముంముకులముజేరు ♦ చందమునను
పొంపుమనతుడల్లి ♦ పెండ్లి జేసిన వెనక
సురజనాళిరెడ్డి ♦ సూరరెడ్డి

౧౨౯ దృష్టి చెదరనీక ♦ దృఢముగా జేపట్టి
చెలగినాడు మంత్రి ♦ చీట్లపేక
అతనితోడ నెపుడు ♦ నట్లాడుకొనరాద

౧30 బుద్ధికొద్ది సుఖము ♦ బువ్వకొద్ది చవులు
చెట్టుకొద్ది పీడ ♦ జెలగుచుండు
దుక్కికొద్ది పంట ♦ దురదకొద్ది గమంట

౧3౧ ఆలికోతె మాలి ♦ యతిశయంబున వచ్చు
సుతులకోతెగల్లు ♦ సుతులు మరల
తల్లికోతె తల్లి ♦ ధరణిలో వచ్చునా

౧3౨ జననిజనకులైన ♦ జన్మజన్మలకు
బడయవచ్చుగాని ♦ పుడమియందు
తన్ను దెల్పుగురుడు ♦ తగలబ్ధమనువేమా

౧33 దేవుడింటిలోన ♦ దేదీప్యమానమై
వెలుగుచుండ నరులు ♦ వెతలదేల
పాపుగుళ్ళకేగి ♦ పనిపని మొక్కేరు

౧౩౪ చెప్పుకొన్న సిగ్గు ♦ ఛీఛీ శరీరంబు
బూతువల్ల నిదియు ♦ పుడమిలోకి
తల్లి వచ్చుచుండు ♦ తా భగమార్గాన
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౧౩౫ మగువ శోణితంబు ♦ పైగప్పిపురుషుని
శుక్ల మంశమవును ♦ జూడ నెలకు
మూత్రగూవు మొదట ♦ జూచితే సరుసకు

౧౩౬ చుక్క లెన్నియున్న ♦ సోముడుంసనినిండు
రాత్రి కెట్టు గల్గు ♦ రమ్యముగను
రాజు లేకయున్న ♦ రచ్చట్టులుండురా

౧౩౭ పుట్టుచున్న యాకు ♦ పుటికివేయుచునున్న
చెట్టుయెమగబోదు ♦ గట్టిగెవుడు
పెరుగుచున్న మనసు ♦ నరుకుమాకిశి గా

౧౩౮ చింతతోట కొనను ♦ చిన్నదున్నదిదాని
పెదవి వంటనంటె ♦ పెద్దమనిషి
యితరస్త్రీలపొందు ♦ నిశదల్చబోదురా

౧౩౯ పుట్టలోన రెండు ♦ గట్టితాత్రిమలుయుండె
బంటనాగసరము ♦ లంటియూడి

పట్టుకున్నవాడె • పరమయోగీంద్రుడు
సురజనాళిగిడ్డి • సూరరెడ్డి
౧౪౦ మూడుమూర్ల పెట్టె • మూతదీసి తెరవని
లోపలుండె పెద్ద • దీపమొకటి
తాళముంచెగాని • తలుపురాబోదయా
౧౪౧ గాడ్దెలారుగలవు • కాళ్లకుగట్టిగ
బందమేయుకున్న • పరుగులెత్తి
పండియున్న చేను • పాడుచేసుకపోయి
౧౪౨ ముందువెనుక లేదు • క్రిందమీదను లేదు
తెరను దీసిగన్న • తెంపులేక
మొండుజూడతానె • మేకమై యుండెరా
౧౪౩ ఎండమావులగని • నిండుభ్రాంతితో నెత్తి
నీరమనుచుబోవు • తీరుగాను
మాయజగముజూచి • మనమటుబడుగిడు
౧౪౪ రంకుకొమరుడైన • బంకింతయును లేక
లచ్చియున్న చెవ్వు • రచ్చకెక్కి
ద్రవ్యబలిమిగాని • తనబల్మికాదురా
౧౪౫ పెంపుకేపెకొలది • పెరుగుచుండును సు

దింపుచేసికొందిది ♦ దిగుచునుండు
పెంపుదింపులేని ♦ పెద్దవై నీవుండు
సురజనాళికీర్తి ♦ సూరకీర్తి

౧౪౬ కప్పుపారవెల్ల ♦ భృంగి మొసగునట్లు
దోమమొసగదెంత ♦ దొడ్డదైన
ప్రౌఢయంగనెనుగు ♦ పదును ముగ్ధమగునా

౧౪౭ విందుదైనగాని ♦ మందుదైననుగాని
మూడునాళ్లుగన్న ♦ మురువుదెలుసు
తెలియదొక్కమారె ♦ తేటతెల్లముగాను

౧౪౮ ఖర్మమణిగెకొలను ♦ చర్మపురంబులో
రాజవీథినొక్క ♦ రమ్యమైన
మడుగు గలదు ♦ స్నానమాచరింపుమట్లోయి

౧౪౯ కత్తిపోట్లుమాన్ప ♦ కలదు మందెచటైన
నిందపోట్లుమాన్ప ♦ నిలను లేదు
సంగతెరిగిదిరుగ ♦ చాలబల్మంచిది

౧౫౦ రాత్రిగనదుపగలు ♦ రాయిగనదుపూజ
వుడమిగనదుజెట్లు ♦ పూచుటయును
తనువుగనదుతన్ను ♦ తగ్గిపోయినవెక్క

౧౪౧ కుక్కుటంబుగూయు ♦ కొక్కరోకో యంచు
కాకులెల్ల గూయు ♦ కావటంచు
కోకిలజనులుకూయు ♦ నోటికొచ్చినయట్లు
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౧౪౨ సంతలరసిజెప్ప ♦ సంతలలోకెల్ల
కొమరిపురవుసంత ♦ గొప్పసంత
సంతజూడబోతె ♦ చింతంతబోవురా

౧౪౩ పడిసి తుడిసినైన ♦ పదియాకలేలాగొ
చేతనుంచుకొన్న ♦ చెల్లుమాట
యాకలేనిమనుజు ♦ డీకిల్వజేసునా

౧౪౪ తప్పు యొప్పులెల్ల ♦ దగదిద్దనట్లయిన
తీర్పుకాడవాడు ♦ తిండికాడు
మేలదినని యొద్దు ♦ మెల్లగీడ్వదమక్క

౧౪౫ గాలివిడుచునపుడు ♦ కడురోతబడెనేల
ముక్కి కంపుయనుచు ♦ ముక్కుమూసి
అంతరోతపడను ♦ యదిమెచ్చటొచ్చెరా

౧౪౬ పొదుగునుండిపాలు ♦ బొండవచ్చుగాని
వాలమందునుండి ♦ వచ్చుటేన

దాతకున్న బారు ♦ ధర్మహీనున కెట్లు
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి
౧౪౭ గాలిలేనిజెట్లు ♦ కదల కుండిన యట్లు
అలలు లేనినీరు ♦ కలగనట్లు
చిత్తమట్లునుంప ♦ చిక్కును మోక్షంబు
౧౪౮ కవులమంచు గద్ద ♦ కావ్యము లల్లేరు
విరహబాధ పెట్టి ♦ విడువకుండ
మోక్షబాధకొంత ♦ మూసూచుటకు లేక
౧౪౯ హంసపోకమును పె ♦ యాపరంత్రిత్ని
దెలిపికొన్న జాలు ♦ దెలివిచేత
హంసదాటిపోతె ♦ యవ్వ లేముందురా
౧౫౦ నష్టిమెఱుకు లేదు ♦ ముష్టికిభువిలోన
కష్టికెపుడు లేదు ♦ కుదురమందు
సృష్టిమెఱుకు లేదు ♦ శుద్ధబ్రహ్మమునందు
౧౫౧ గాలిమనసు దృష్టి ♦ కదలకుండను జేసి
నాసికాగ్రిమందు ♦ సమరసిల్చి
జూడుమచ్చటున్న ♦ సూర్యచంద్రులనెప్పు
౧౫౨ జీవుడు మరికాదు ♦ దేవుడనగ లేకాదు

తరము స్థిరముగాదు ♦ శాశ్వతముగాదు
కాదుకాదుయనెను ♦ వాడురా పరముడు
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి
౧౬౩ పోతుయున్నమనసు ♦ పోనీయకను బట్టి
గురుపదంబుజేర్చ ♦ గుర్తెరింగి
సాధనంబుయదియె ♦ సన్మార్గముగుశో త్రవ
౧౬౪ పాలయందెగలదు ♦ పాటింప మీగడ
నీళ్లయందెగలదు ♦ నిబిడనాను
తనువుయందెగలదు ♦ తత్వమావినెనంటి
౧౬౫ ఉత్తముండగాదు ♦ నిత్తెముయునయుత్త
దొంగతోత్తుగాదు ♦ తోటికోడ
లల్పతనువుగాదు ♦ నాపరబ్రహ్మంబు
౧౬౬ చెప్పలేమయనక ♦ చెప్పుచుంటిని వినుము
తొలిపలినంగతంత ♦ తోసికట్టి
పేరుగొప్పగాని ♦ యూవరస్యదిబ్బరా
౧౬౭ పరిశ్యగాత్మయన్న ♦ బాహ్యక్రియనియున్న
స్వస్వరూపమన్న ♦ చోద్యమన్న
పురుషపర్యదన్న ♦ పొసగ నీయెరుకవే.

౧౬౮ మోహిని జూచినాడు ♦ యౌవన మోహముబుట్టి
మోముగన్న బుట్టు ♦ ముచ్చటంత
దొరను జూచిగాని ♦ తొత్తును జూచయూ
సురజవాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౧౬౯ నన్ను జూచి నీవు ♦ నసహ్యమందకు
నా సుభార్య గుణము ♦ నరసిజూడు
తన్వి మంచిదయిన ♦ తనకేమిలోటురా

౧౭౦ మనసు భ్రాంతిగాక ♦ మరి దేమనుంతయున
పూర్ణసాంద్రమందు ♦ పొద్దుచూడ
కలలో గన్నయట్టి ♦ గజముల రీతిగా

౧౭౧ యోగదండితోలు ♦ యొడలెల్ల విభూతి
రుద్రమాల లన్ని ♦ రూఢిగాను
మోతబరువుగాని ♦ ముక్తింతయున్న లేదు

౧౭౨ డెంద మెరుగుదారి ♦ నందంబుగానుండు
ముందుజూపగన్న ♦ ముప్పుగాని
చేవ గా లమట్ట ♦ చెల్లుటకొరకెగా

౧౭౩ గూటిలోనయొక్క ♦ గుడ్లగూబగలదు
దానిపల్కువినిమె ♦ దారిబోతె

వెళ్లు కార్యమెప్పుడు ♦ వెంటనే సిద్ధించు
సురజనాలిగిడ్డి ♦ సూరరెడ్డి

౧౭౪ పాత్రి నేర్చి నేర్చు ♦ పదిలంబుగాగన్న
మైక్యమందగల్గు ♦ సతనియందు
అట్టివానికండ ♦ వెట్టిదురవస్తలు

౧౭౫ భూతధాత్రిమీద ♦ వుట్టుచుండినప్రాణు
లట్టియుండబోవు ♦ గిట్టకుండ
వుట్టుచున్న దెవ్వడు ♦ గిట్టుటకొలికెరా

౧౭౬ పాటపసకువాడు ♦ పరగనొక్కడుయుంటె
మెచ్చుటకును పోవు ♦ మెచ్చరుంద్రు
రత్నగనిలోనెవుడు ♦ రాళ్లునుదుగున్నట్లు

౧౭౭ శ్రీగామరుప్పరమున ♦ శ్రీరామచంద్రుండు
కలవు వానిజూడు ♦ కనులనిండ
భుక్తిముక్తిరెండు ♦ పూనికతోనిచ్చు

౧౭౮ ఉన్నవాడుపోగ ♦ యుక్తవానిసిబట్టి
మొత్తుకేమ్చుచుండ్రు ♦ మోహమువాయ
కొంతగుండుచున్న ♦ యేనాటికొచ్చునా

౧౭౯ దగ్గనున్న యట్టి ♦ దానిగనగలేక

దేశదిమ్మరగుచు ♦ దిరుగనేల
ఊకువెదకినట్లు ♦ యుద్యాలబిడ్డుండ
సురజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౧౦ సాంద్రమందు రెట్ట ♦ సాగిపోవుచు గాకి
విడినయంతలోన ♦ చెడునవిధము
కుజనులిడినకూత ♦ సుజనులకును లెక్క

౧౧ మంత్రమున్నచోట ♦ తంత్రమమరియుండు
తంత్రమమరుచోట ♦ మంత్రముండు
మంత్రతంత్రమీడ ♦ మార్గంబుజూడరా

౧౨ వంటపాత్రలందు ♦ వసరపేటికలందు
భూతగణములందు ♦ పొదలయందు
అఖిలమేనులందు ♦ సంతద్వ్యాడశిమొరా

౧౩ జీవుడన్నతాన ♦ దేవుడన్నదుతాన
జ్ఞానమన్నతాన ♦ జ్ఞప్తితాన
భ్రాంతియన్నతాన ♦ బ్రహ్మమన్నదుతాన

౧౪ మేనునేనులేక ♦ మేధినంతెవ్వడో
నిండినిబిడియున్న ♦ నిర్మలాత్మ
డట్టివానిరెపుడు ♦ పట్టిపూజించరా

౧౮౫ అద్దమందునీడ ♦ వద్దుగానియట్లు
తామరాకునీట ♦ తడియనట్లు
బ్రహ్మవేత్తలట్లు ♦ ప్రాపంచమంటను
సుజనాళిగిడ్డి ♦ సూరరెడ్డి

౧౮౬ వనధులన్ని నిండు ♦ వసుధబావులు నిండు
నదులు నిధులు నిండు ♦ నందముగను
మాయపొట్ట యెపుడు ♦ మరినింపబోదురా

౧౮౭ పసిడి మంచిదైన ♦ పసికాదుమంచౌను
పంటమంచిదైన ♦ పంటహెచ్చు
నోరుమంచిదైన ♦ యూర్దై మంచిదౌ

౧౮౮ చదువు లేనియట్టి ♦ సంగీతమును లేదు
సాధనుండనట్టి ♦ బోధ లేదు
పసికిరానిమొక్క ♦ ప్రాపంచమున లేదు

౧౮౯ పతిని దైవమంచు ♦ భావించనేరక
పరులకెత్తగాలు ♦ పాటియాన
ఆడదనియ కాదు ♦ గాడిదదియొగాని

౧౯౦ మధువుకేగుచుండు ♦ మధుసూదనుని చెప్ప
విద్యకేగుచుండు ♦ విచ్చిలిలను

కయ్యములకు నేగు ♦ కంగాళి స్త్రీలట్లు
సురజనాళి గద్దె ♦ సూరకెక్కి
౧౯౧ ఆటనున్న కలిమి ♦ కంటికింపు గనలేక
భూమిబడవు పరుగ ♦ బుద్ధి చెడును
తినకుమెంత నీవ ♦ తగిలియున్నట్టుండ
౧౯౨ బారుకోలదివ్వ ♦ భాగ్యశాలికి జెల్లు
పిసినిగొట్టు కెట్లు ♦ పిలువ జెల్లు
కోరుకోలదివరము ♦ హారువిచ్చునట్టుగా
౧౯౩ గోరుచున్నకోలది ♦ పెరుగుచుండునట్టు
తిరుగుచున్నకోలది ♦ తిట్టువచ్చు
సాగుచున్నకోలది ♦ సంతసిల్లుమది
౧౯౪ తల్లిలేనిబిడ్డ ♦ తల్లడించినరీతి
మబ్బులేనియెండ ♦ మాడ్చురీతి
యిల్లులేనిబతుకు ♦ నింతంత హింసరా
౧౯౫ బాధగురువు లేమి ♦ వేదార్థమగును
బోధ గురువులెమగు ♦ భోగమంత
జంటితేన మహిమ ♦ జోరెగలెమగునా
౧౯౬ బొమ్మలాటగాదు ♦ బొమ్మలాడిదిగాని

సిగులు నివ్వెరావు ♦ చింతగాని
శైవ్వసప్నమిదియు ♦ బొబ్బవిండ మకాదు
సురజనాళిరెడ్డి ♦ సూరరెడ్డి
౧౮౭ అంతరాత్ముడగుచు ♦ యఖిల భూతములందు
సాక్షిరూపుడైన ♦ సామికీవుదు
మరిసమర్పణంబు ♦ మాత్సద్యపూలన్ని
౧౮౮ చెండ్లవలెనుగిరులు ♦ చేతనాడగవచ్చు
కడలిమొంతలోతొ ♦ గాంచవచ్చు
నాతిమానసుదెలియు ♦ నలవిమే బ్రహ్మకు
౧౮౯ యోనికూటమెల్ల ♦ యొక్కటేగద యిచ్చ
బరులస్త్రీలకొఅకు ♦ పరుగులేల
కుండలేరుగాని ♦ మొనముగా మన్నేర
౧౯౦ కులము లేనివాని ♦ కూడు గుడువ రోత
బలునితోడ కలహ ♦ పడుటకోత
పడ్డకిచ్చిసొమ్ము ♦ గడ్డితినుట రోత
౧౯౧ విష్ణుకైనగాని ♦ జిష్ణుకైనగాని
భవునికైనగాని ♦ భవునికైన
కాలమొక్కరీతి ♦ గడిచియుండగబోదురా

౨౦౨ చంద్రమామయందు • చలువగలిగినట్లు
భూమిలోన నీరు • పుట్టినట్లు
ధర్మపరులమదిని • దాక్షిణ్యమటుబుట్టు
సురజనాళిగిడ్డి • నూరరెడ్డి

౨౦౩ మొదలులేనిచెట్టు • తుదవరకెక్కియు
జిగురుటాకు గోసి • శీఘ్రముగను
విస్తరల్లి దమ్ము • విందద్దు నీ కెప్పు
సురజనాళిగిడ్డి • నూరరెడ్డి

౨౦౪ హంసనారియనెడు • సంసారిస్త్రీకూడి
ఆరు మేడ లెక్కి • యచట గలదు
కృష్ణశయ్యయొకటి • బోయిపండుకొ వేగ

౨౦౫ గుల్లకాసికృష్ణ • కొల్లకీయగరాదు
కోపగాని చెలిమి • కూడరాదు
పరులుచేసిమేలు • మరువగబోరాదు

౨౦౬ కనులు ముక్కుచెవులు • కరములతో మూసి
పరసుఖమ్ము నందు • వాంఛనిలుప
గురువులదయ యందు • గొప్పమాన్యత్రికి
సురజనాళిగిడ్డి • నూరరెడ్డి

బట్టుట కరిహరబ్రహ్మలె
తిట్టులుడిసి పారిపోవె ♦ దిన్నగ రెడ్డీ
౨౧౨ వ్యాసిం చెరుకే పొత్తము
జేసించెరుకే సవరణ ♦ తెలుగుచునచ్చున్
వేసిందెరుకే యూకకు
జేసిందించేమి నేను ♦ జెప్పర రెడ్డీ
౨౧౩ ఎరుకను వదలించనియూ
గురునమ్మకము వేగనీవు ♦ కోటిచైన్యన్
ఎరుకను వదలించెడియూ
గురునకు బదికోటులైన ♦ కొనుమా రెడ్డీ
౨౧౪ తనసీడ నన్ను జూచిన
దన వెరుకటి రూపమెల్ల ♦ తత్వముతానై
వసుదినమును తనుబాయక
మనమానందంబుచేయు ♦ మహిలో రెడ్డీ
౨౧౫ గనుగొన నలవియుగాకుం
డనయము నొకరీతి కనుల ♦ కనుపడువాడుం
తనుతా నెరుగని పురుషుడు
గనుగొని పూజించు వాతని ♦ గట్టిగ రెడ్డీ

౨౧౮ కాలివలి నీవై వరకను
దలచుము పలుమారుదాని • తప్పక వెదలో
అల కీటక మళియగావిని
మలిరాబోవది చెప్పను • మహిమపరెడ్డి

౨౧౯ తనుతానై దాఁగిలిదియు
ననుమానము లేకయున్న • సదిద్యాదశిగా
ఘనముగ పోషసి జలికివ
మననము నీమాయకాంత • మరి నహి రెడ్డి

౨౨౦ పీరాణి పీఠుడగు గురు
నారాణిలదిసను దెలియు • నాబద్యార్థం
చోకికవసము జెప్పెడి
వారి పద్యార్థమెరుగ • వశమే రెడ్డి

శ్రీ........శ్రీ........శ్రీ



